# సంగమేశ్వర శతకము.

ఇది

గుంటూరుజిల్లా నందూరు పురనివాసి

## నందూరు లక్ష్మీనరసింహారావుచే

రచియింపఁబడెను.





ప్రథమముద్రణము 1000, ప్రతులు



1924

ఇస్లామియా ప్రెస్సు.

పిఠాపురము.

 [వెల ౧

శ్రీ

# నకరేశ్వరశతకము.



ఇది

గుంటూరుజిల్లా నండూరు పు[illegible]

నండూరు లక్ష్మీనరసింహారావు[illegible]

రచియింపఁబడియె.



ప్రథమముద్రణము 1000, ప్రతులు

**1924**

ఇస్లాంయా ప్రెస్సు,

పిఠాపురము.



[వెల 0—6—0

## మహా జనాభి ప్రాయములు.

---

ఇది శ్రీ నందూరు లక్ష్మీనరసింహ రావు గారు నందూరు గ్రామమందున్న ఈశ్వరుని పైని చెప్పిన పద్యములు. పద్యము లన్నియు సీసములు. ఆనుపూర్వికముగ మన దేశమున వచ్చుచున్న కవితా సంప్రదాయము నణుమాత్రమైన దాటిన ట్లు దీనియం దగుపడలేదు. శ్రీనాథాదుల సీసములవలె నుండి శైలిని ధార గలిగి యున్నది. అచ్చటచ్చట పరమేశ్వరుని గూర్చి చేయఁబడిన రూప కల్పనము చాల బాగున్నది. భక్తుని యొక్క వేదన కూడ గ్రంథమున గనుపడక పోలేదు. గ్రంథక ర్త యిటే యింకకొన్ని గ్రంథములు వ్రాయుటకు ప్రోత్స హించు చున్నారము

( ఇట్లు 24జూన్ 24 వెలువడిన గుంటూరు పత్రిక )

తే॥ గీ॥ వితత శ్రీ పరమేశ్వర • శతకముచు ర
చించె నందూరు మా నర • సింహరావు
ధన్యుఁ డన్నిట కృతిని సా • మాన్య నరున
కిడక శివున కిచ్చెను జ్ఞాన • మెసఁగ మెసక ॥

రా ॥ గో ॥

# దేవదారు ద్రావకము.

ఇది జగత్ప్రసిద్ధమైన దివ్యౌషధము. దీనివలన సమస్త వ్యాధులు పోవును. అనఁగా వంటిపైవేయు కురుపులు మత్సలు వగైరాలు లోపల జ్వరాది వ్యాధులు సులభముగా కుదు రును. సీసా 1కి రు 1-3-0 లు.

వలయువారు:— యం. యు. మె. షా. అండుకో పిఠాపురం.



# శ్రీసకలేశ్వర శతకము.



శ్రీకంఠ సురవార • సేవిత శృంగార
భక్తమందార సం • భవ విదూర
గౌరీ మనశ్చోర • కారుణ్య విస్తార
దుష్టసంహార ని • ర్దిష్టశూర
గంగా జటాభార • కైలాస సంచార
సురు చిరాకార బం • ధుర విచార
వారాశి గంభీర • వైరివీరవిదార
శుభతారహార స • న్నిభ శరీర॥

చోర దనుజాపహార త్రి • శూల ధార
భయ విపద్ఘోర దావాగ్ని • వర్షధార
గిరిజ హృదయేశ సంతూరు • పురనివాస
స్ఫటిక సంకాశ సకలేశ • భవవినాశ॥

# శ్రీ వరకేశ్వర శతకము.

సీ॥ నీవు పృథ్వ్యంబువుల్ • నింగిపావకసమీ
రాధి భూతాత్మకం • బగుచునుండి
ఆదిత్య కమలాహి • తాంగారకాది న
వగ్రహంబులనంగఁ • బరగుచుండి
బ్రహ్మవిష్ణ్వక్సేన • పశుపతి మున్నగా
నమర బ్రహ్మర్షిముఖుఁ • లనఁగనుండి
నిత్యశుద్ధ శ్రౌత • సత్యంబులును యజ్ఞ
ములును లోకత్రయం • బులుగనుండి।
సర్వమూర్తివి నీవనఁ • జాలుచుండి
జీవులను బొమ్మలంబుగఁ • జేసినావు ॥గిరి॥ 2

త్రి బుల . హూ మజన్మ
మత్యుత్తమంబని • తార్యవరులు
అందు విప్రకులంబు • నందు జన్మించుట
యనఁగ మహోత్కృష్ట • మనిరి ధాత్రి
వానఁ బురుషుఁడౌచు • దనివి వర్ధిల్లుట
పూర్వ భవార్జిత • పుణ్యమనిరి
అందు బ్రహ్మజ్ఞాన • మమరి నీపదభక్తి
గల్గుటయే మహా • ఘనతయనిరి।
గాని నినుగొల్చి ముక్తిని • గాంచువాఁడె
ధన్యుఁడన్నట విబుధవ • రేణ్యుఁడశేఁషు ॥గి॥ 3

సీ॥ శతవత్సరంబుల • మితియందు రాత్రులం
యందు నిద్రను కొంత • హరియునొందు
బాలవృద్ధత్వాది • బాధల కొంతయుఁ
గొంత పొట్టకొరుల • కొలువునందు
కొంత వ్యాధులచేత • గుందుటవలనను
కొంత వియోగాది • వంతవలన
పతి సుతాదులగాంచు • వంతనంబునఁగొంత
పరుల బాధించు బా • పమునఁగొంత
యున్న దెన్నియొ నిల్లెయా • యువునుమిగుల
నిన్ను భజియించు టెన్నఁడో • నీలకంఠ ॥గిరి॥ 4

సీ॥ నీపాద పద్మముల్ • నెరనమ్మి నంయము
లాన గైకొనిరి కై • లాస పదవి
నినువేడి సగరుము • న్మనుమఁడు తాతల
గంగచేఁ బుణ్యలో • కంబుఁజేర్చె
నినుఁ దపంబొనరించి • ఘనుఁడు మార్కండేయ
ముని చిరంజీవియై • మనియెధాత్రి
నిను ధ్యాన మొనరించి • నిర్జరుల్ విపరాపి
బోనాది యమృతంబుఁ • బుచ్చుకొనిరి॥
భక్తులకు నెల్ల పెరటి క • ల్పకము నీవు
నీకు నముఁజెప్పెడి ధాత్రి • నిగమవంద్య ॥గిరి॥ 5

## శ్రీ వకతేశ్వర శతకము.

సీ॥ మానము లెవరంచు • మానముల్దెగడువ్వి
గర్వింపదాననే • మనత గల్గు
లేని గంభీరత్వ • మూని దంభంబున
గులుకంగదాననే • గొప్పమెప్పు
ఇందునేడవగుదీవు • చందునేడ వగుదని
నర నుతి సేయనే • నాణ్యముండు
అధికారమొప్పు నా • కనుచు సజ్జనకదం
బము లేచదాననే • ఫలితముండు
ఇట్టి దుష్టపు చర్యల • నేమిగల్గు
చెన్ను వహియించు నీభక్తి • చేతగాక ॥గిరి॥ 6

సీ॥ బాణాసురుండెట్టి • బాంధవుండగునంచు
గావలి వాకిట • గాచినావు
ఘనుఁడు మార్కండేయ • మునినీకుఁ జుట్టమా
మొసఁగఁ బూర్ణాయు వె • ట్లిచ్చినావు
గుహ్యకేశ్వరుఁడెట్టి • కూర్మిభక్తుండు నీ
కలకాపురంబిచ్చి • నిలిపినావు
పాండు నందనుఁడెట్టి • పరమశిష్యుఁడు నీకు
పశుపతాస్త్రంబిచ్చి • పనిపినావు
నిక్కముగ వీరియందున్న • నెక్కువేమి
నీకు వీరందఱికివలె • నేనుగాన ॥గిరి॥ 7

సీ॥ చంద్రసూర్యులు రథ ◆ చక్రంబులుగ భూమి
యరదంబు వేదము ◆ లశ్వములుగ
నలువ సారథియును ◆ నై నభమువిల్లునుగాగ
మాధవుండొప్పెడి ◆ మార్గణముగ
హాటకాచలవరం ◆ బమరుచాపవు ముల్కి
యై నిలింపులు సేన ◆ లై భవాని
శక్తిరూపంబుచే ◆ సాయమొనర్పంగ
నీవు రుద్రుండవై ◆ నిలిచియునికి॥
దుష్ట రాక్షస నికరంబు ◆ ద్రుంచిలోక
పాలనముచేసి సజ్జన ◆ పాళినేలు ॥గిరి॥ 8

సీ॥ లోకాళి ఫణముపై ◆ వీఁకవహించిన
కాల సర్పము చేతి ◆ కంకణంబు
పదునాల్గు భువనముల్ ◆ భస్మరాసిగఁజేయ
నోపు హాలా హాలం ◆ బోగిరంబు
సర్వభక్షకుఁడునై ◆ జగమంత విహరించు
నట్టి పావకుఁడు నీ ◆ కైన కన్ను
ఖలవిదూరత్వంబు ◆ గావించునట్టి శ్రీ
విష్ణువే నీకగు ◆ పెద్దవిల్లు॥
ఇన్ని గల్గిన నీవేడ ◆ యితరులేడ
యితరులనుగొల్వ మూఢుఁడి ◆ కెట్లుగల్గు ॥గిరి॥ 9

శ్రీ సకలేశ్వర శతకము.

సీ॥ *షట్ఛాస్త్రములనుదా • జదివివిమించినను లే
దరయ సమాధుల • యందులేదు
జప తపాదుల లేదు • శౌచస్థితుల లేదు
పొందుగా యోగాదు • లందు లేదు.
మంత్ర తంత్రాదుల • నమ్మరి లేదు యోగాన
నాది సాధనములం • దద్ది లేదు
కాషాయ వస్త్రముల్ • గట్టిమెట్టిన లేదు
వనముల సంచరిం • చినను లేదు॥
గాని మోక్షంబు నీభక్తి • గల్గినట్టి
పుణ్యపురుషుల సొమ్మండ్రు • బుధజనంబు॥గిరి॥ 10

సీ॥ చరణాన నాధార • చక్రంబునను గప్పి
హంసను హృదయంబు • నందు జేర్చి
దాని స్వాధిష్ఠాన • దళములందునఁ జేర్చి
యపుడు పూనికపీడ • క చోటువాపి
మణిపూరకంబున • మఱినిల్పి విడువక
బూని యనాహతం • బునకుఁ జేర్చి
మొనసి యాజ్ఞా చక్ర • మునఁ జేర్చి యును సహ
స్రార చక్రంబున • సరగ జేర్చి॥
సర్వ సంగంబులను వీడి • సాధుయోగి
చూడఁజూడంగ నీ న్న • చొప్పు దెలియు ॥గిరి॥ 11

సీ॥ తులలేని ధనరాసి • కలిగి వర్ధిల్లెడి
గుహ్యకేశ్వరుఁడు నీ • కూర్మి సఖుఁడు
పంచ భక్ష్యాన్నము • ల్బరఁగఁబెట్టెడి తల్లి
యైన భవాని నీ • కతివమిన్న
బలులు షణ్ముఖ వీర • భద్ర విఘ్నేశ్వరా
దులు నీకు పుత్రులౌ • దురు శశాంక
నందీశ్వరాది స • ద్బృందంబు నీచేత
పాలింపఁబడు మహా • ప్రమథ గణము॥
పూజ్యతను లావ్రనను మహా • భోగమునను
ఇలను నీతుల్యు మెవరౌదు • రిందు భూష॥గిరి॥ 12

సీ॥ సర్వజ్ఞ పశుపతీ • శంకర చంద్ర శే
ఖర మహేశ్వర యిందు • ఖండభూష
గిరిశ మృత్యుంజయు • గీర్వాణ వందిత
శూలి శర్వేశ్వర • సుజనపోష
భూతేశ పాపారా • ట్బ్యామ గణాధిప
శితి కంఠ హర హరా • శ్రిత విచార
గంగా జటాజూట • గగన కేశవిలాస
సురవందితాకార • దురితదూర॥
అంచు వినుతించు నట్టివాఁ • డవని యందు
నధికుఁడను పూజ్యుఁడును వాని • కవసిదెద్ది॥గిరి॥ 13

# శ్రీ నకలేశ్వర శతకము.

సీ॥ శివుని కోవెలలకుఁ ♦ జేరని పాదముల్
బాదముల్ గావవి ♦ పాదపములు
జితసూన శరుని బూ ♦ జింపని హస్తముల్
హస్తము ల్గావవి ♦ హస్తి హస్త
ములుపురాంతకు వేడఁ ♦ బోవని యానోరు
నోరుగాదది దరీ ♦ ద్వారచయము
హరుని పాదంబుల ♦ కర్థిమ్రొక్కని తల
తలగాదు రుబ్బు పా ♦ త్రింబెగాక॥
అవని నీపూజనముసేయ ♦ నట్టిజనుఁడు
జనుఁడుగాడయ్యె చలియించు ♦ శవముగాక॥గిరి॥ 14

సీ॥ వనము భూమ్యాకాశ ♦ వాయు తేజంబులు
పంచ భూతంబులై ♦ పరగుచుండు
రూఢి గంధస్పర్శ ♦ రూపశబ్దాదులు
పంచ తన్మాత్రలై ♦ పరిఢవిల్లు
పాదవాక్పాణి యుపస్థపాయువులైదు
కర్మేంద్రియంబులై ♦ ఘనతఁగాంచు
చక్షు జిహ్వాఘ్రాణ ♦ చర్మశ్రోత్రాదులు
వెలఁగి జ్ఞానేంద్రియం ♦ బులుగ దనరు
అలమనోబుద్ధి య ♦ హంకారచిత్తంబు
లంతరింద్రియములై ♦ యతిశయించు॥
ఇందు నీవాత్మ రూపివై ♦ నిమిడియుండి
స్థూల రూపుండు నానెవ్వ ♦ శూలివీవు॥గిరి॥ 15

సీ॥ కాటితేఁడనుచు లో • కంబు వాకొనఁగనా
పాపము ల్గాల్చవే • పరమ పురుష
గంగాధరుండనం • గను జేరియతోడనర్గ
సపవిత్రులఁ జేయవే • నన్ను లాంగ
భూతి రుద్రాక్షపరి • పూత ధారివనంగ
భూతి నొసంగవే • భుజగ భూష
భక్తవత్సలుఁడంచు • భవ్యులనఁగ నిత్య
కైలాస మియ్యవే • గౌరినాథ॥
నీవు లోకస్వరూపివై • నిగడు దండ్రి
చూపు నాకొక్కసారి నీ • రూపు దేవ ॥గిరి॥ 16

సీ॥ అరయ బ్రసూనంబు • లందు గంధంబును
జలధిలో బడబాగ్ని • నిలిచినట్లు
కట్టె యందనలంబు • గలిగిన విధమున
నుర్వియందోషధు • లుండినట్లు
పాలలో ఘృతమును • వజ్రంబులోఁ తేజ
మాకసంబున శబ్ద • మమరినట్లు
అంబుదంబుల దుద • కంబు గల్గినయట్లు
చెఱకునందునఁ దీపి • గురిసినట్లు॥
ధర పిపీలికమాదిగా • ధాతదాఁక
నిండియుండెడి నీమూర్తి • నే భజింతు॥గిరి॥ 17

సీ॥ లోకత్రియంబు న • వీనకొప్పెడి శైల
రాజముల్ కల్యాఁబు • లై తనర్చ
గంగా సరస్వతుల్ • గాగలనదులు డె
బ్బదిరెండు నాడులై • పరిఢవిల్ల
ధర వేష్టితమును నా • ధారంబునగు జల
రాశి గర్భంబౌచు • రాజిలంగ
కలిత సంధ్యా కాల • ములు వస్త్రములు మేఘ
ములు వాలములు నౌచు • వెలయుచుండ
మించి శతకోటి రవుల ని • ర్జించునట్టి
నీదు ఘనతర వస్మూర్తి • నేభజింత్తు॥గిరి॥ 18

సీ॥ ఇల పాదములు మహా • బిలము పొక్కిలియునై
నలినాప్తుఁడును శశి • నయనములుగ
దిక్కులు శ్రోత్రముల్ • దివిశిరంబునుగాగ
వహ్ని బింబాబోష్ఠ • వదనముగను
గాలి ప్రాణముదివౌ • కసులు బాహువులుఁగ
నిశిదివా నీకము • ల్నిమునములుగ
అంబుజాసనుఁడు గు • హ్యాంబు వర్షంబు వీ
ర్యంబుఁ బొచదువులై • యాసనంబుఁ॥
గాగ నొప్పెడి నీమూర్తి • గణుతిసేయు
నట్టివాఁడను నీవు న • న్నాదరించు॥గిరి॥ 19

సీ॥ పాపంబులను( జావ( • దాపంబులను మాప
నోపెడి సద్దివ్య • రూపువాని
నొగిమాయలను మాయ • ముగ( జేయ భవరాశి
నగు హేయముల( • ద్రోయ( దగినవాని
తెలివొంద( దనయందు • వెలియ( దు జగమందు
గల యంతరమునందు • గలుగువాని
భవతత్త్వ వికార • భవచేష్టలుదువ(గా
నవలీలతను జేర • దివియువాని

మునిజనోత్తమ వినుతుని • ఘనుని భవుని
నిన్ను భజియింతు నామది • నిశ్చయముగ॥గిరి॥ 20

సీ॥ పాపముల్బాపిన • న్గాపాడకుంటివా
పశుపతి వను పేరు • వమ్ముసుమ్ము
నినుమది పూజించు • వను నేలకుండిన
సర్వజ్ఞు(డను నది • సాకుసుమ్ము
ఇంకైనదయ నాదు • వంక( జూపకయున్న
శంకరుండనుమాట • బొంకుసుమ్ము
ఈతీరు భక్తాళి • లాతి చేసిన యుప
ఖ్యాతి నీకగునని • వ్రాతసుమ్ము॥

పాపముల( ద్రోసి నావంక( • గోపముడిగి
యాపదల(బాపి కాపాడి • ప్రాపు(జూపు॥గిరి॥ 21

సీ॥ వర్ణాశ్రమాచార • పద్ధతులనువీడి
పెడత్రోవఁ ద్రొక్కు పా • మరజనంబు
బ్రతికినన్నాళ్లును - పశువులై చరియించి
పరవనితలఁ బొందు • పాప జనము
అర్థంబుగొనిమన • స్వర్గ లుద్భవమందఁ
గూట సాక్ష్యములిచ్చు • కూళజనము
పాపమంచెంచక • భంగు కల్లును చేసు
సారాయి త్రాగుయ • సాధుజనము
వగచుచున్నారు ధాత్రిపై • బహువిధముల
వీర లంధులు నీదారి • గానలేరు ॥గిరి॥ 22

సీ॥ జగముల వెల్గించు • జలజాప్త జలజ వై
రుల నెవ్వఁ డాశల • వెలయఁజేయు
గుణులకు గురువైన • హరి హర బ్రహ్మాది
సురుల కెవ్వఁడు స • ద్గురువయుండు
పంచ భూతాళి నా • డించు మాయను వహి
యించి రూపించునే • సృష్టికర్త
రాజిల్ల భువనముల్ • దేజ విస్ఫూర్తితా
రాజాధి రాజుల • రాజెవండు॥
విగత గుణరూప నామ్ముఁడై • నెగడు నెవఁడు
వాఁడె నీవంచుఁ దెలిసిన • వాఁడ ఘనుఁడు॥గిరి 23

సీ॥ భారమా నీపగ • వారమా మావల్ల
నేరమేమున్నది • నీలకంఠ
చూపు మాదయను గా • పాడుమా నేను నీ
వాఁడను బ్రోవవే • వామ దేవ
ధర్మమా నాజన్మ • కర్మమా నీభక్తి
నిర్మలాత్మునిజేయు • నిగమవంద్య
పాపమా నీకింత • కోపమా నామీఁదఁ
జూపవే నీదయ • పాపదాల్ప
మించు లోకాళి నెల్ల ర • క్షించునీవు
నన్నుఁ రక్షించుటొక లెక్క • యున్నదయ్య॥గిరి॥ 24

సీ॥ ఒక భక్తుఁడొగివేడ • నకలేశ సతినైన
విడి వాని సుతుఁడవై • పొడమినావు
ఒకనికై సర్వస్వ • మొగివీడి వానిడా
హృదయాంతరంబునం • దొదిగినావు
ఒకని రక్షింపఁగఁ • బ్రకటానురాగ నే
త్రుండవై యమరాజు • ద్రోలినావు
ఒకనికై నీవు మే • నక పుత్రితోఁడ నే
తెంచి కోర్కెల నెల్లఁ • దీర్చినావు
భక్తులనుఁబ్రోవ నెక్కడా • న క్తి నీకు
భక్తినినుఁగొల్వ నెక్కడా • సక్తినాకు॥గి॥	25

సీ॥ అన్నపూర్ణాదేవి • యతివయై కొల్వ నీ
వాది భిక్షుండవై • తైతివయ్య
అలధనాధిపుఁడు నీ • కాప్తహితుఁడుగాఁగ
బునుక కప్పెర నెట్టు • బూనితయ్య
రజతాచలంబు నీ • రతనీయముగాఁగ
గాటిఁజేఁడ్డితివే • కరణి నీవు
గాంగేయ గిరినీదు • కార్ముకంబుగనుండ
బూది నీవెట్టులఁ • బూసితయ్య॥
అయ్య నీచర్య లన్నింటి • నరసిచూడ
కలిమిలేములు నీకు నొ • క్కటిగఁ దోఁచు॥గిరి॥ 26

సీ॥ ఏపరితృప్తి భక్తు • లేపట్ల వసియుంతు
రయ్యది కైలాస • మనఁగఁ జెల్లు
నీస •మమమిరతం • బేనోటఁ బేర్కొను
నతఁడె సచ్చరితాత్ముఁ • డనఁగఁ జెల్లు
నీభక్తులనుమహా • నిష్ఠ సేవించు వా
రిని జన్మసాఫల్య • లనఁగఁ జెల్లు
నీమూర్తి గన్నుల • నిరతంబు గన్గొను
నతని మహా మహుం • డనఁగఁ జెల్లు
వాఙ్మనంబుల నెల్ల నీ • పాలుజేసి
యవ నివర్తించు బుణ్యు నీ • వనఁగఁజెల్లు॥గిరి॥ 27

సీ॥ ఒకవంక దేవతా • ప్రకరంబు సేవింపఁ
బ్రమధ గణాదులు • భక్తిఁ గొల్వ
నొకవంక ఘోర సనకాది • సకలమౌనులు వేద
శాస్త్రసూత్రంబుల • న్జదువుచుండ
నొకపార్శ్వము నవినా • యక షణ్ముఖాదులు
వేడ్కఁ వింజామర • ల్విసరుచుండ
నొకప్రాంతఁ బ్రేమసీ • కొనఁగు నద్భక్తాళి
నోరూర నీకథల్ • నుడువుచుండ

నార్యఁ గూడుచు నందివా • హనము నెక్కి
కోటి జలజాప్త కాంతుల • తోటి రమ్ము॥గిరి॥ 28

సీ॥ వరగ భ్రూమధ్యమా • ఫాలనేత్రముతోడ
వామాంకమున గౌరి • వనితతోడ
గళమునందున హాలా • హలముతోడను జటా
జూటమందున గంగ • బోటితోడ
కంధరంబున వెల్గు • కాకోదరము లోడ
మాళి వెల్గెడి నెల • బాలుతోడ
తార హీరాదుల • స్త్రీలు సొబగుతోడ
శర్వాణి పెండ్లివే • సంబుతోడ

కమలహిత కోటులేకమౌ • కాంతితోడ
నమితముద మొప్ప నాకు బ్ర • త్యక్షమగుము॥గిరి॥ 29

సీ॥ అప్రకాశత్వమై • యచలమా నీయందు
బరగ దివ్య ప్రకా • శంబు బుట్టె
ఆప్రకాశత్వ మం • దమర శాంబరి మహా
తత్త్వంబుచే గుణ • త్రయము బుట్టె
వాని కవ్యక్తంబు • వలన భూతములైదు
బుట్టఁ దన్మాత్రలా • భూతములను
బుట్టి ప్రపంచకం • బును జేయు నీమాయ
మించి నృత్యంబు నా • డించుచూడు
నట్టిమాయను గెల్చు మ • హామహుండె
గాంచగల్గును నీరూపు • కలవు దీర॥గిరి॥ 30

సీ॥ చెప్పఁగ నొక్కొకసారి • శివశివాయన సర్వ
పాప సంఘంబులు • బాసిపోవు
నంత రెండవసారి • యట్లవేడఁగ నందు
తులలేని పుణ్యంబు • గలుగు నతఁడు
మొక్కి నిత్యబ్రహ్మ • మోదమార్గాత్ముఁడై
మూఁడవ మాఱన • మోక్షమబ్బు
నట్లు నాల్గవసారి • యతిభక్తితో నీశ
నములుఁగా నీయందు • నైక్యమొందు
నట్టి నినువీడి యితరుల • నాసపడుట
కాంచనము వీడి యినుము కా • ంక్షించునట్లు॥గిరి॥ 31

సీ॥ మూఁడులోకములు నీ • మూలమై నిన్గొల్వ
కాశియందింత న • త్కరుణయేమి
నుతియించు నదులెన్నొ • క్షితిగల్గఁ గాదయు
గంగయం దుంచితా • ఘనతయేమి
అశ్వ గజాది వా • హనము లెన్నియొ గల్గ
నందినెక్కుటవల్ల • నాణ్యమేమి
భక్తులెందఱో నిన్నుఁ • బాయక సేవింప
నల్ల మార్కండేయు • నధిక మేమి
సర్వసమానకు నీకు ప • క్షంబుగలదె
దేవమును బోవ రమ్ము నీ • తోవఁ గొమ్ము॥గిరి॥ 32

సీ॥ ఘన జటామకుట సం • ఘటితేందు సౌందర్య
మందాకినీ ద్యుతు • లందు చుండ
వితత మందాకినీ • ద్యుతులనంటగ మహా
భుజగ భూషల కళల్ • బొదలుచుండ
భుజగ భూషలకాంతి • బొలుపార స్పృశియింపఁ
దనుకాంతి జగమెల్ల • దనరుచుండఁ
దనుకాంతి స్పృశియించఁ • దగనొప్పునంది రా
డ్వాహనుకాంతి చా • వచ్చుచుండ
వీని మీఱుచు దివిభువి • లోన నిండి
నీయశఃకాంతి ముఁద జ • వేయు మందు॥గిరి॥ 33

## శ్రీ సకలేశ్వర శతకము.

సీ॥ నీఫాలఘటితమౌ • నెలబాలుఁడే లోక
జనిత తమంబుల • సంహరింప
నీహస్తఘటితమౌ • సాహిత్య గ్రంథముల్
మొదివేల్పు నందియం • బులు హరింప
నీకృపావీక్షణా • నీకము జెలఁగి లో
కముల కెల్లను శుభం • బమరఁజేయ
నీదివ్య నామంబు • లే దిక్కుఁగాంచిన
భక్త మానసములఁ • బగగు నిడఁగ
నక్షమాలను నొకచేత • నవధరించి
నట్టి నీరూపుఁ జూపి నీ • యంశఁ జేర్పు॥గిరి॥ 34

సీ॥ నీలసద్వైరాగ్య • నియతి గన్గొని సన
కాది మహామునుల్ భక్తి • నంజలిడిరి
నీదు సంపూర్ణాత్మ • నిశ్చయంబును గాంచి
బ్రహ్మాదు లాశ్చర్య • భరితు లైరి
నీమనోజ్ఞపు రూపు • నివ్వెఱపడి గాంచి
మదనుఁడు తనరూపు • వదలినాఁడు
నీవిక్రమ క్రియ • నియతిఁ గన్గొన మృత్యు
దేవి జితత్వము • నెఱపుచుండ
నీవు భక్తుల కిచ్చెడి • నేర్పుగాంచి
దివిగవిముఁ గల్ప భూజంబు • దిగులు జెందె॥గిరి॥ 35

సీ॥ కమనీయ దివ్య వ్యా ♦ ఘ్రిపు చర్మరాజంబు
నంచితాసనము గా ♦ వించి మించి
ఖండితాఖండ ప్రి ♦ చండదీ ధితినొక్క
బునుక కప్పెరచేతఁ ♦ బూనియుండి
జపమాలఁ దిప్పు హ ♦ స్తంబు మూయఁగనొక్క
యంచితగోము ఖం ♦ బమరఁ, దాల్చి
రమ్యరుద్రాక్షు హా ♦ రంబులు గళమున
సర్ప భూషల మధ్యఁ ♦ జక్కపఱచి
యమల చిత్తంబు చిన్మయం ♦ బందు జేర్చి
నట్టి శ్రీదక్షిణామూర్తి ♦ వైతివయ్య॥గిరి॥ 36

సీ॥ ఆది మధ్యాంత వి ♦ హారాది నూన్యుఁడై
కర్తృభోక్తృత్వము ♦ ల్గాంచు నెవఁడొ
నిత్య నిర్మల దివ్య ♦ సత్య స్వరూపుఁడై
గత నామరూప సం ♦ గతుఁ డెవండొ
తపజప వ్రతములఁ ♦ దఱచఁ జూడఁగ రాక
బ్రతిదిశ దానమై ♦ పరగు నెవఁడొ
ప్రణవ మంగళ వాద్య ♦ భరిత మోదాత్ముఁడై
బాహ్యమేళనముల ♦ న్బాయఁ డెవఁడొ
అట్టి పరమేశ్వరుఁడవు ని ♦ న్నభినుతింతు
నామనోవాంఛఁ దీర్చు మ ♦ నాథనాథ॥గిరి॥ 37

సీ॥ శంభు శంకర పదా • సక్తుడౌ పురుషుండు
నిడుములెన్నిటినైనఁ • గడవవచ్చు
శివ నామమును స్మరిం • చెడువాఁడు సంసార
దీనవార్ధినిఁబడ్డ • తేలగలఁడు
భూతేశు పాదముల్ • పూజించు నతఁడు సౌ
భాగ్యంబు విజయంబుఁ • బడయవచ్చు
శితికంఠు సేవచేఁ • జెన్నొందు నతఁడెట్టి
బ్రహ్మ హత్యలనైనఁ • బాయవచ్చు
ననుచు వింటిని వేడితి • నయ్య నన్నుఁ
గావఁ బూనిన నపకీర్తి • గలుగు నీకు॥గి॥ 38

సీ॥ సకల దుఃఖంబుల • నణఁగింపఁగాఁ జాలు
పాపసంఘంబులఁ • బారఁద్రోలు
అణిమాది సిద్ధుల • నరుదుగ సమకూర్చు
కోటివిద్యలు నను • కూర్చి నేర్చు
భవ దుఃఖ హేయువుం • బాధలఁ బోఁద్రోలు
మంత్రి తంత్రాదుల • మహిమ గూర్చు
భూఁయు శాధ్యుని • న్భూతివంతునిఁ జేయు
బ్రహ్మ వర్చస్సున • వఱలఁ జేయు
తుదకుఁ గైలాన మనుమహా • పదవిఁ జేర్చు
గాన నీనామ స్మరణకు • గలదె సాటి ॥గి॥ 39

# శ్రీ సకలేశ్వర శతకము.

సీ॥ కాలాహి నెవఁడైనఁ • గట్టునే మ్రుంజేత | ౯
ఘనమైన రతనంపుఁ • గంకణముగ
నేత్రింబుగాఁగ వ • హ్నినినె వ్వఁడుధరించు
ధైర్య సంకలితుఁడై • ధాత్రిలోన
హాలా హలముఁ బట్టి • యవలీల నెవఁడైన
నోగిరంబుగఁ దిన • నోపఁ గలఁడె
రహి వియద్గంగా త • రంగాళి నెవఁడైన
ఘన జటస్థలి సేయఁ • గాఁగలఁడె
ఇట్టి కొన్నియొ గలవు నే • నెన్న గలనె
నిన్ను దేవాది దేవ • లెన్నవలయు ॥౪౧॥ 42

సీ॥ ఎన్ని దినాలు ని • న్నున్నతు ల్గావించి
నీమహాళి నొప్పి వె • న్నెల లఁ జేఁడు
ఎన్ని వర్షములు ని • న్నేర్పడఁ బూజించి
నీ జటాస్థలి గంగ • నిల్వ నేర్చె
ఎన్ని హాయనములు • నిన్నర్థి మెప్పించి
యర్థాంగి యయ్యె నీ • కన్నపూర్ణ
ఎన్నాళ్లు నీదయ • కీక్షించి యానంది
దన మూఁపుపై నిన్ను • దాల్చుచుండె
నభవ వీరి సహస్రాంశ • మైనఁగాని
గాను నామది వసియింపఁ • గాఁ దలంతు ॥౪౨॥ 43

సీ॥ బహువిధ కుసుమ న • త్ఫలములతోనొప్పి
రమణీయములగు నా • రామములను
బహు మణిస్థగితసో • పాన సంకలిత సుం
దర పర్వత పరిఖా • తత్తులయందు
అంబర చుంబితం • బై శరచ్ఛ్రీ సుధా
కరుఁ బోలు శైల శి • ఖరములందు
నతులితంబౌచు దే • వతలు చరించెడి
మన తరంబైన శృం • గాటకముల
నీలవత్స్వాద పద్మము • లెన్నిమ్రొక్కఁ దాల్పఁ
జేసెఁ బుణ్యంబుఁ జాల కై • లాస నగము॥గి॥ 44

సీ॥ వసుధపై నీవైభ • వంబుఁ జూడని కన్ను
లుండిన నేమి లే • కున్న నేమి
అనువైన నీనామ • మును వదింపని జిహ్వ
యుండిన నేమి లే • కున్న నేమి
స్థిరమైన నీపూజఁ • జేయనేరని చేతు
లుండిన నేమి లే • కున్న నేమి
నినుఁగూర్చి నడువంగ • నేరని పాదంబు
లుండిన నేమి లే • కున్న నేమి
యవని నీపూజ సేయని • యవయవ బు
లెన్ని యుండిన నేమి లే • కున్న నేమి ॥గి॥ 45

# శ్రీ నకరేశ్వర శతకము.

సీ॥ భారమా నను బ్రోవ • నేరమా నిను వేడ
గారి మనకేశ్వర • కాలకంఠ
పాపమా నన్నేల • లోపమా నాయందు
నాపదోద్ధారక • యమరవినుత
ఎంతైన దయనురాధు • పంతమా మాపైని
యంత కాంతక పికి • యాగ్ని నేత్ర
వేదరాసివృందు • జాడఁ జూపర చంద్ర
చూడా మహేశ్వర • సుందరాంగ
సుజన సుతిపాత్ర శంకర • శుభ చరిత్ర
భక్తవన జైత్ర నను బ్రోవఁ • జాడి సీ॥గిరి॥46

సీ॥ ఘోరా టవులలోనఁ • జేరి నగ్ర తపస్వి
నై యుండఁ జాలనో • యయ్య నేను
ఆఁకలి బిగఁబట్టి • యాహారమున సోలి
యుపవాసములఁ జేసి • యోపలేను
పశ్వాములనుఁ బట్టి • బంగారమునుఁ బెట్టి
వెలఁగు యజ్ఞాదులే • సేయలేను
క్రోధాదులనుఁ బాపి • కూడ వద్వైతిచే
వరమాని తనమున • వలయలేను
దాన ధర్మంబు సేయు నా • తరముగాదు
గాని వద్భక్తి సేయు • కృగను నేత్ర ॥గిరి॥47

సీ॥ దవళ వస్త్రంబులఁ ♦ దాల్చి కన్నుందక
ఖుభ చర్మమును దాల్చి ♦ యొసఁగితేల
ఘన చందనాది స ♦ ద్గంధాదు లలఁదక
భస్మంబు మెయిఁబూసి ♦ పరగితేల
తరళ ముక్తాహార ♦ తతులను దాల్పక
కాకోదరముఁ దాల్చి ♦ క్రాఁగితేల
రమ్య సౌధాంతర ♦ రాజిలో నుండక
యొక గట్టు పైకెక్కి ♦ యుండనేల
అ బరవి లేపమణిహార ♦ హర్మ్య చయము
భక్తులకు నిచ్చి నీవిట్లు ♦ పరగనావు ॥గిరి॥ 48

సీ॥ లోక వాసనలఁ గ ♦ ల్లోలమైయున్న నా
బుద్ధిని ద్దలఁచెడిఁ ♦ బొంతఁ బోదు
గండ్రివల్కులను బ ♦ ల్కంగఁ బూనిన నాదు
జిహ్వా నీకథనంబు ♦ సేయఁబోదు
సౌఖ్య హీనవు వస్తు ♦ చయము గాంచెడి నాదు
నేత్రము ల్నినుఁగాంచ ♦ నేరవెపుడు
చెడ్డ మాటలు విన ♦ నొడ్డు నాచెవులు నీ
మించు సత్కథ లాల ♦ కించఁబోవు
ఏమిసేయుదు నేమన్న ♦ నేమి ఫలము
వీని నీదారి త్రిప్పెడి ♦ విథముసేయు ॥గిరి॥ 49

సీ॥ వీఁడు దుష్టుఁడటంచు ♦ వీడఁగాఁ జెల్లదు
నను బ్రోచు నట్టి పా ♦ వనుఁడెవండు
వీఁడశౌచుఁడని ♦ విడనాడఁగా రాదు
నను నాదరింపంగ ♦ నాథుఁడెవఁడు
వీఁ డధర్ముఁడని ♦ విడచివేయఁగవద్దు
నను దయనేలు ధ ♦ న్యాత్ముఁడెవఁడు
వీఁడు దుర్గుణుఁడని ♦ వేఱు చూడఁగ రాదు
నను గృపఁ జూచెడి ♦ ఘనుఁ డెవండు
దేవ నిను నమ్మినాఁడ నా ♦ దిక్కు నీవు
పాలనో నీటనో ముంచి ♦ యేలుమయ్య ॥గిరి॥ 50

సీ॥ రహి నిస్కాందాదిపు ♦ రాణముల్ చదువంగఁ
గుతుక మెక్కువ యుండుఁ ♦ గొందఱకును
నిగమాగ మాదుల ♦ నిరతంబు చదువనా
నందమై యొప్పును ♦ గొందఱకును
భజన తత్పరులౌచు ♦ భక్తిచే సేవింపఁ
గోర్కె యుండును మఱి ♦ కొందఱకును
జప తపాదులు వేడ్క ♦ సల్పి నిస్మ్రిప్పించు
తొందర మదినుండుఁ ♦ గొందఱకును
ఇట్టు లెందఱో గలరు నీ ♦ యిష్టులంతు
నేను గొఱగాని వాఁడన ♦ న్నేలుమభవ ॥గిరి॥ 51

సీ॥ కోపవిస్ఫూర్తి నీ • కనుగల్గ నీరేడు
భువనసంచయములు • బుగ్గిగావె
కన్నెఱ్ఱవాటిన • ఘనకులశైలముల్
గుప్పలైధాత్రిపైఁ • గూలిపోవె
హుంకారమునవిల్చి • యట్టహాసముసేయ
గ్రహగోళములుదెగి • రాలకున్న
వెచ్చనినిట్టూర్పు • వెలిఁబుచ్చ వారాశు
లేకునునొకమాటె • యింకిపోవె
కోరి నీతోడి పగవెట్టు • కొనడి దుష్ట
మానసులురూపహీనులై • మ్రగ్గిపోర ॥గి॥ 62

సీ॥ ఖర్జూరద్రాక్షాది • ఘనవస్తుసంచయ
మందుమూ యాతీపి • యందుఁగలదె
మధు శర్కరాదుల • మాధుర్యమానని
యందుమా యాతీపి • యందుఁగలదె
పనస జంబురసాల • ఫల రసముల బలీ
యందుమా యాతీపి • యందుఁగలదె
అమృత రసంబని • యాశతోడుతఁ బల్కు
చుందుమా యాతీపి • యందుఁగలదె
యిద్ది యపురూపమిది దివ్య • మిదియతేంద్రి
యంబు రుచులకు రుచినీకు • భాఖ్యజపము ॥గి॥ 63

సీ॥ నందూరు క్షేత్రమ ♦ ఖండమై నీయుక్కి-
వారణావతి యాచు ♦ వసుధ వెలయ
తుంగ భద్రానది ♦ పొంగారుచునుఁ దూర్పు
నను వియద్గంగయై ♦ గనుపడంగ
వేద వేదాంగ సం ♦ వేత్తలౌ బ్రాహ్మణో
త్తములు మునీంద్రులై ♦ దనరుచూడ
జగతిబూజ్యంబైన ♦ నకలేశ లింగంబు
విశ్వనాథుండౌచు ♦ వేడ్కనొప్ప
భక్తవరులను రక్షింప ♦ యుక్తమతిని
వెలసితివి గాక నీకన్న ♦ వేల్పుగలఁడె ॥గీ॥ 54

సీ॥ అమరు సద్భక్తిచే ♦ నైన మహాభీతి.
నైన దీనతచేత ♦ నైనఁగాని
యతికోప భరమున ♦ నైనఁదాప భరత
నైన హీనతచేత ♦ నైనఁగాని
యాయవారము కొఱ ♦ కైనధీహీనత
నైన ధోరణిఁ దప్పి ♦ యైనఁగాని
యతివతోఁ గలహించి ♦ యైనఁ గూటికి లేక
యైన నేమిటఁ దోఁచ ♦ కైనఁగాని
మెట్టులైనను నీనామ ♦ మెట్టినోట
నైనఁబల్కినఁజాలు పు ♦ ణ్యాత్ముఁ డగును ॥గీ॥ 55

సీ॥ పన్నీరు బుడ్లు నీ • కున్న వే శంకరా
యున్నను సరియె లే • కున్నఁ జెప్పు
చక్కని వస్త్ర సం • చయము నీకున్న దే
యున్నను సరియె లే • కున్నఁ జెప్పు
తరళ ముక్తాహార • తతులు నీకున్న వే
యున్నను సరియె లే • కున్నఁ జెప్పు
ఘనరత్న మకుట సం • గతియు నీకున్న దే
యున్నను సరియె లే • కున్నఁ జెప్పు
నీకు లేకున్న నా కిట్లు • నిద్రపట్టుఁ
దెల్పు మెచటైన యాచించి • తెచ్చి యిత్తు॥గీ॥ 56

సీ॥ ఒక భార్య గడుసు వే • ఱొక భార్య ముదిది నీ
కొడుకు చూడఁగఁ బెద్ద • కడుపువాఁడు
ఆముసీ రోగిరం • బాఁబోతు తత్తడి
తలపుత్తరయే నీకుఁ • దగిన పాత్రి
కాకోదరమె దండ • కాడు పువ్వుల పాన్పు
కనటు చర్మము నీదు • కట్టుబట్ట
నీ నివాసము కొండ • నింగి నీకేశంబు
బిచ్చమెత్తుటయునఁ • బ్రియ పథంబు
ఇట్టి నీచర్యలను గాంచ • నేహ్య మొదవుఁ
గాని యాశ్చర్య మొదవులో • కముల నేల॥గీ॥ 57

సీ॥ దివ్యోదకంబుల ♦ దిగనాడి మృగతృష్ణ
నమితికి హస్తము ♦ ల్సాచినట్లు
కాంచనంబబ్బినఁ ♦ గాదని పంచలో
హాములఁ గైకొనుటకై ♦ యరిగినట్లు
పన్నీరు గంధ లే ♦ పనమును మాని హే
రంత తైలము మేయి ♦ రాచినట్లు
కలకండ వలదని ♦ కాంక్షించి పటికను
దెచ్చి మోహాయసి ♦ మెచ్చునట్లు
అగును నినువీడి యితరుల ♦ కానవచుట
నీవె సర్వ ప్రపంచంబు ♦ నిశ్చయముగ ॥గిరి॥ ౬౮

సీ॥ మాను చూడఁగ బండ ♦ మహిమ చూడఁగఁజండి
హితుఁడు మాయా సమ ♦ న్వితుడునీకు
తలపై నిశాటుండు ♦ తత్తడి పోటరి
పొత్తు భూతగణంబు ♦ పొదలు నీకు
కాపు కాట్లాతఁడు ♦ కడుపువాడు సుతుఁడు
నిప్పు గ్రక్కెడి దృక్కు ♦ సగము నీకు
ముంజేవినవుగాఁడు ♦ పురుఁడు వేనళ్ళవాఁడు
సారథి యొకవేద ♦ ఐదుఁడు నీకు
ఇట్టి వారెల్లనిన్ జేరి ♦ యొనర మెసఁగ
భక్తులను జేరనిత్తురే ♦ భవ విదూర ॥గిరి॥ ౬౯

సీ॥ కైలాస గిరికేఁ • గదలి పోవలెనంటె
రాను పోవచటికి • రైలు లేదు
అర్జంటుగా వార్త • నైనఁ బంపుదమన్నఁ
గాని యటకు టెలి • గ్రాఫు లేదు
దరఖాస్తునైన నీ • దయకుఁ జేసెదమన్న
ఫారమెచ్చట లభ్య • పడఁగ లేదు
కష్టసుఖంబులు • గలసి చెప్పెదమన్న
నిచ్చోట క్యాంపని • తెలుపఁగరాదు
ఏమి సేయుదు నిన్గాంచు • నిచ్చ బోదు
కంటికిని గూర్కు రాదు ము • క్కంటి వినుము॥గిరి॥ 60

సీ॥ పది రూప్యములకేయి • బానిసత్వముఁ జేయు
జడుఁడు సైకిలు నెక్కి • మిడిసి పడును
అధమాధమునకింత • యధికార మబ్బిన
సుజనుల బాధింపఁ • జొరవఁ జేయు
చెడి బ్రతికినవాని • చేతిలో శతరూప్య
ములు గల్గ నక్షత్రి • ములు గణించు
పది యక్కరముల సం • పర్క మందినహీన
కులుఁడు బ్రహ్మద్వేష • కుండు నగును
ఏమి చెప్పుదు కలికాల • మిది నిజంబు
నిన్ను భజియించువార లెం • దున్నవారొ॥గిరి॥ 61

సీ॥ గంటకొక్కకవెయ్య • గాఁగ బద్యంబుల
ఘనముగాఁ జెప్పెద • మనెడివారు
రాజాధి రాజులు • రహిమెచ్చ నవధాన
మును జల్పినారమే • మనెడివారు
తర్కమీమాంసవే • దములు శాస్త్రంబులు
పడ నేర్చినామని • పలుకువారు
బ్రహ్మ రహస్యముల్ • తగఁ జెప్పెదమంచు
పొంచి కొండతీ మోస • ఘమ్మువారు
కలదు కృతిమదంభముల్ • పలుకువారు
వారి పాత్రుఁ నాకు నీ • భజన దక్క ॥గీ॥ 62

సీ॥ ఏనాటికైన నా • యెనట నీదగు మహా
రూపంబుఁ గాంతు నా • పావనాంగ
కాంచి సద్భక్తితో • నంచితోక్తుల నీదు
స్తుతుల నొనర్తు నా • సుజన పాల
స్తుతుల నొనర్చి నీ • సురుచి రాంఘ్రిఁ గోర్కె
దీఱఁ బూజింతునా • దివ్య వినుత
పూజించి నీదయా • పూర్ణత్వమున శుచి
త్వము నొంది యుందునా • దానపోష
అట్లు శుచినొంది దేవాళి • కందరాని
మట్టి సాయుజ్య లక్ష్మిఁ జే • పట్టగలనె ॥గీ॥ 63

సీ॥ పంచ కావ్యాదుల ♦ బ్బఠియింపఁగాలేదు
　　　　ప్రబంధంబులఁ ♦ జదువలేదు
అర్థ శాస్త్రాదుల ♦ నభ్యసింపఁగలేదు
　　　　వేదార్థములవల్లె ♦ వేయలేదు
వేదాంత శాస్త్రివు ♦ విధమెట్టిదో రాదు
　　　　స్వర శాస్త్రపఠనంబు ♦ సలుపలేదు
యతిలక్షణాదిని ♦ యతిని జూడఁగలేదు
　　　　బుద్ధి సంస్కారంబుఁ ♦ బొందలేదు
గాని నీపదభక్తియా ♦ గ్రంథ రచన
క్తై సహాయతఁ జేసెనో ♦ శైక నాథ॥గిరి॥　64

సీ॥ ఇనకోటి నిభతేజ ♦ మెనఁగు నీముఖ బింబ
　　　　మందు పాల్గొని మించు ♦ నార్యగలుగ
మంగళ ప్రదదివ్య ♦ మణిభాస మగునీదు
　　　　గిరి వసించిన యతి ♦ వరుఁడు గలుగ
మేటి తపంబున ♦ మెప్పించి శస్త్రాస్త్ర
　　　　తతిఁగొన్న గాధినం ♦ దనుఁడు గలుగ
భరత శాస్త్రంబునఁ ♦ బరఁగ నిన్మెప్పించి
　　　　బంటుగా నినుగొన్న ♦ బాణుఁడుండ
నిట్టివారు నీకెందఱో ♦ యెనఁగుచుండ
నేను నీకేమి లెక్కయ ♦ హీన భాగణ ॥గిరి॥　65

# శ్రీ సకలేశ్వర శతకము.

సీ॥ సకలుఁడై ధరఁబిపీ • లికలాదిగాఁగల్గు
బ్రహ్మాండమంతయుఁ • బర్వెనెవఁడు
ఎవఁడుమూర్తిత్రయం • బెసఁగలోకాళికి
జననపోషణముల • జరపుచుండు
ధ్యానయోగాదిసా • ధనముల వేత్తలే
దివ్యసెల్లప్పుడుచిం • తింపుచుందురి
భక్తులెన్నను బహిః • ప్రాణమట్లులుచూచి
వారికోర్కులఁదీర్పు • వాఁడెవండు
ఎవఁడునామక్రియారూప • హీనుఁడట్టి
సర్వసాక్షిని నిన్నునే • సంస్మరింతు ॥౬౬॥ 66

సీ॥ ఆకాశవీథిపై • నద్భుతంబుగనొప్పు
నుడుగణరాజినె • వ్వఁడుసృజించెఁ
గోట్లసంఖ్యను మీఱి • కోమహొప్పునీభూత
జాలమెవ్వఁడుచేసి • సాగఁజేసె
రంగదుత్తుంగత • రంగసంగతమైన
వారాశి నెవ్వఁడు • వఱలఁజేసె
నిచ్ఛమాత్రంబులో • నీరేడు జగముల
సృష్టించి మొసఁదువ • సింపఁజేసె
ట్టి నీశక్తి వర్ణింప • నఁవి యగునె
ఈవె కాలస్వరూపమై • యొసఁగుదువఁట ॥౬౭॥ 67

సీ॥ బర్హిర్ముఖాది స • ద్భక్త సేవితశర్వ
శర్వాణి చిత్తత • స్కరవిదర్ప
దర్పకో జృంభణో • గ్రత్యనాశక నేత్ర
నేత్రి వైశ్వానర • నిర్మలాంగ
అంగజ జనకన • మంచితో జ్వలబాణ
బాణ సంసేవ్య క • పాలభూష
భూషణాంగీ కృత • భుజగ రాజవిరాజ
రాజశేఖర కృపా • రంభ చిత్త
చిత్తాస్థిత సద్భక్త • క్షేమకలిత
కలిత సద్భక్త పరిపాల • ఖలవి ఫాల ॥గిరి॥ 68

సీ॥ నక్షత్ర గణముల • నడుమను రంజిల్లి
పెంపొందు హిమకరు • బింబమట్లు
బల్లవ పంక్తిలో • పలు విరాజిల్లెడి
లలిత రసాల ఫ • లంబురీతిఁ
బలు తీరులగు ఖగ • కులములో వాసిని
గాంచిన సొబగురా • యంచపగిదిఁ
మృగ సంచయంబులో • దగనొప్పు భూరి ప
రాక్రమాన్విత మృగ • రాజుకరణి
నవనిఁ బురుషుల గాంధి మ • హాత్ము నట్లు
దేవతలయందు శ్రేష్ఠుండ • వీవె దేవ ॥గి॥ 69

సీ॥ సనకాది వందిత • సాధు సంసేవిత
విగత రావణ గర్వ • వినుతపాద
పాద సంఘట్టి తా • భేద లోకత్రయ
త్రిపుర సంహార వి • రించి క్రూర
క్రూర రాక్షస నాశ • నారంభ నుతపగ
పదనాశ దుష్ట సం • షద కదంబ
కాదంబినీవనా • గారవాస ప్రియ
ప్రియ సుధాకర ఖండ • నయ కలాప
ఆపదోద్ధారకా వివి • ధార్థిలోక
లోకబాంధవ కైలాస • లోకవాస ॥౧౨॥ 70

సీ॥ దివ్యమంగళగాత్ర • దేవర్షితప్రియ
ప్రియవియద్గంగ యు • పేంద్ర బాణ
బాణ దైత్యేంద్ర వి • పక్షశిక్షణ
క్షణమే నగాత్మజే • క్షణప్రసన్న
సన్నద్ధశూల ప్ర • శస్త్ర సాధన సంగ
సంగ విధ్వంస సా • రంగ హా ణ
రణలక్ష్మి ముఖాదర్శ • రంజిత భాస్కర
కరజప రుద్రాక్ష • కలిత దివ్య
దివ్యముని గణసేవిత • దేవదేవ
దేవతా నికరక్ష స్వ • భావచారు ॥౧౩॥ 71

సీ॥ పృథ్వి సంబంధ మీ • విషపూరితవుఁ దిత్తి
యసువులు చెల్లిన • నవనిఁజేరు
వాయు సంబంధమా • ప్రాణమీ తిత్తినిఁ
బాసిన గాలిలో • 'పలని గలియు
అరయ నప్పంబంధ • మగు ద్రవంబెల్లను
ద్రవమంది చేరు సం • త్యంబునందు
ఆకాశ తేజంబు • లప్పుడ గగనాగ్ని
భూత ద్వయంబునఁ • బోయిచేరుఁ
గాని యాత్మ స్వరూపంబు • నైన నీదు
తేజ మెందును బోదనీ • తెరువుఁజేరు ॥గీ॥ 72

సీ॥ అహారమును దక్కి • యాయాసమున స్రుక్కి
దేహ పటుత్వంబు • తిరుగు వడఁగ
మెయితోలు జీఱొంద • మెదడు క్షీణతఁజెందఁ
దల కంపమునుఁ జెందఁ • దలఁపు లుఱలఁ
జేత దండముఁబట్టి • చేరి సూనులఁదిట్టి
యీసు నొందఁగ రుజ • లేపుమీఱ
మాంద్యంబు మతిఁగప్ప • మాటధోరణిఁతప్ప
గాత్రంబు పొమ్మనఁ • గాదు పిల్వ
సమయ మే తెంచ నిన్ను నే • సంస్మరింపఁ
గలుగుదునొ లేదొ యిప్పుడె నీ • దలఁతుభక్తి ॥గీ॥ 73

సీ॥ దుష్టరాక్షస కోటిఁ • దునుమాడు ఖడ్గంబు
మహితమౌ నీనామ • మంత్రజపము
దారిద్ర్య భరపీడి • తస్వరూపము మాప
నిర్జర భూజమౌ • నీదుసేవ
అహిత కోటుల ధాత్రి • నణఁచి విజృంభించఁ
గుళిశంబు నీదు స • ద్గోష్ఠి దేవ
పాపంబు మాన్పి స • త్పథమందగాఁ జేయుఁ
దగుసొజ్జ యగును నీ • దగు విచార
మరయ రోగాదులకును ది • వ్యౌషధంబు
గాదె నీయర్చనముకన్న • నేది మిన్న ॥౭౪॥ 74

సీ॥ పరఁగ నీరజమె యు • త్పత్తికి మూలమై
నీరజోద్భవుఁ డన • నెగడు చుండె
కలిమి నీసాత్త్వికం • బేరక్షకంబయి
వైకుంఠుఁ డన ధాత్రి • వాసిఁగాంచె
నరగనీ తమసంబె • సంహారకంబౌచు
రుద్రమూర్తి యనంగ • రూఢి కొప్పె
నెంచనీ గుణకూట • మే ఫలప్రదమౌచు
శక్తి సత్త్వంబనఁ • జాలుచుండె
జగతిఁ గన్పట్టు నీసృష్టి • జాలమెల్ల
నీదు సంకల్పమున గాని • లేది గలదు ॥౭౫॥ 75

సీ॥ మణిసౌధములు చాయ • వనములు గలిగి రా
ప్పారు కైలాసంబు • నందుఁజేరి
గౌరి మానసదివ్య • సారస విగళిత
మకరంద పానంబు • మరఁగి మఱఁగి
రత్న వైడూర్య ను • రకత మండితుఁ డైన
యక్షేశ్వరుని స్నేహ • మభిలషించి
సన్నుత జ్ఞాన సం • పన్న యోగాత్మతా
మునిజన సేవఁ గై • కొనఁగ నేర్చి
చిత్తజ ధ్వంసనము వీడఁ • జెల్లునయ్య
దిక్కునీవంచుమది నెంచి • తిని మహాత్మ ॥గిరి॥ 76

సీ॥ దర్ప మోహ క్రోధ • దంభలోభ ద్వేష
కామాదులే జల • గ్రాహములుగ
ధాత్రిని ధనపుత్ర • దారేషణాదుల
హంకారమును దరం • గాదు లుగను
ధర్మంబు శుచిసత్య • దాన సత్సంగత్వ
రాజిదే యందలి • రత్నములుగ
యజ్ఞ స్వరూపివై • యఖిల గర్భస్థ సం
కలితుండ వగు నీవ • గట్టుగాఁగ
నొప్పు సంసార సాగరం • బాగఁగలంప
నీవ తరియింపఁ జేయఁగా • నేర్తు వభవ ॥గిరి॥ 77

సీ॥ అనిలముపూరితభ స్త్రి • యైననీ తనువున
కంత్యకాల ప్రాప్తి • యైన యపుడు
యమదూతలు మహా భ • యంకరముగఁ గాల
పాశ సాధనములఁ • బట్టిలాగఁ
గాయంబు విడలేక • కరము వేదనఁబొందఁ
దుదకు యాతని జీవ • పదముఁదీసి
తెచ్చినఁ గని కాలుఁ • డిచ్చతోఁదుతవాని
పాప పుణ్యంబుల • పట్టికనెంచఁగి
బహు విధంబుల హింసించి • బాధపెట్టుఁ
గాని నిను గొల్చువారికి • గలవె వెతలు ॥గి॥ 78

సీ॥ నీనత్కథల్విన • నాసగల్గుటయును
నట్టి స్తన్యంబాను • నట్లుచేసి
భద్రాక్ష రుద్రాక్ష • భస్మాదులను దోవ
కలుషాపులకు రక్ష • గాఁగఁజేసి
భవదీయ సద్భక్తి • భావనా శయ్యపైఁ
బదిలంబుగాఁ బ్రేమఁ • బండఁబెట్టి
నీమహా భక్తుల • నిత్యసేవ యనెడు
డోలలో బోధను • జోలపాడి
యెపుడు దర్శన కౌతుకం • బెసఁగ నిచ్చి
భక్త శిశువుల రక్షింపఁ • బరఁగి నాథ ॥గి॥ 79

సీ॥ పరమేశ నీ మహా • భక్తుఁ డీతం డన్న
శమనుండు పాఱఁడే • చాలభీతి
సమర కోటులు భూమ • ణాళి నారతి నిచ్చి
దయకుఁ బాత్రులు గాఁగఁ • దలఁపఁబోరె
ముక్తి కాంతామణి • ముదముతో నవ్వాని
కేలుఁ గైకొని మెచ్చఁ • జాలకున్నె
తాపసోత్తములు సం • తస భరితాత్ములై
బ్రహ్మ రథంబును • బట్టరారె
భవదుదార మహా భక్తి • భరితు నకును
చేటు లేదు మహాత్ముఁడు • సిద్ధుఁడతఁడు ॥గీ॥ 80

సీ॥ అల హేమ మణి సౌధ • యములు గల్గిన వారు
గజవాజి గోవులు • గల్గువారు
వదనంబు చెన్నొంద • వాణి శారద మౌచు
విద్యా పరిపూర్ణులై • వెల్గువారు
తనువు బంగరు చాయఁ • దగ మోము శశిఁబోల
నేత్ర పద్మంబుల • నెగడు వారు
అనుకూల దాంపత్య • మును సుతుల్ చుట్టలు
గల్గి విస్తృత కీర్తిఁ • గనిన వారు
పూర్వ భవమున నెంతేని • పూజ నీకుఁ
జేసి మెప్పించ నీరీతిఁ • జెలఁగి నారు ॥గీ॥ 81

సీ॥ దీనుల పాలిటి • దేవుండ వగు దీవు
పసలేని దీన మా • నవుఁడ నేను
నీవు ధీరత నొప్పు • నేతవై యున్నావు
పాపపు బుద్ధియు లేని • వాఁడ నేను
లోకాళి గర్భంబు • లోన నిల్పితి వీవు
లోకంబులో నుంటి • వీఁక నేను
మాయ రూపము మాయఁ • జేయ జాలెద వీవు
మాయామోహావృత దు • ర్మతిని నేను
గాన నీకును నాకును • గలదు బాంధ
వంబున న్నన్ను రక్షింపఁ • బాడి నీకు ॥గిరి॥ 82

సీ॥ భక్తు మార్కండేయు • వసుఁ బ్రోవఁగా యమ
ధర్మరాజును ద్రొమ్మఁ • దన్ని నపుడు
నీరజాక్షుని మోహ • నీ స్వరూపముఁ గాంచి
యతి మోహమున వెంట • నరిగి నపుడు
కైలాసగిరిఁ బంక్తి • కరుఁ డెత్తఁగ వాని
దుడుకెల్ల నేలంటఁ • ద్రొక్కి నపుడు
దారుకా వనమందుఁ • దపసుల చిత్తముల్
దెలియ భాండను రీతిఁ • దిరిగి నపుడు
భవదమల పాద కమలము • ల్భావ నేము
ప్రకట మన్మనశ్చిత్త పా • దుకలఁ జేస్తు ॥గిరి॥ 83

సీ॥ మనసు నీ ధ్యానంబు • మఱఁగి ముదంబందఁ
గనులు నీ రూపంబుఁ • గాంచి మించఁ
గరయుగ్మమును నీదు • ఘన పూజనము సేయఁ
జరణముల్ నీవుండు • దరికిఁ జేర
శ్రోత్రముల్ ప్రేమ నీ • శుభ చరిత్రము విన
నేత్రంబు లాసక్తి • నిన్నుఁ గాంచఁ
దలనీదు మనపద • స్థలిఁ జేరి మ్రొక్కంగఁ
బలుకు లెప్పుడు నీ స్త • వంబు వలుకఁ
జేసి తేనియఁ జాలునా • జీవితంబు
ధన్య మగునట్లు సేయుము • దయ దలిర్ప ॥గీ॥ 84

సీ॥ జగములఁ బ్రోవనీ • సాటి లేరనుటకు
హాలా హలము మ్రింగు • టగును సాక్షి
దుష్ట శిక్షణ మొన • ర్తువు నీవ యనుటకుఁ
ద్రిపుర సంహారంబె • విపులసాక్షి
భక్తులఁ గాచుట • పరఁగు నీకనుటకు
బాణు గేహాంపుఁ గా • వలియె సాక్షి
శిష్ట రక్షణ మెప్డు • చెల్లు నీ కనుటకు
ముని సుతుఁ బ్రోచుటే • మొదటి సాక్షి
సాక్షులకు లోటు కలదె? యీ • శ్వరుఁడ వీవు
నీవు భక్తాళిఁ బ్రోచుటే • నిశ్చయంబు ॥గీ॥ 85

# శ్రీ సకలేశ్వర శతకము.

సీ॥ శాశ రాజార్చిత ◆ రాజావతంస సమ
రాజీవ హితకోటి ◆ రమ్యతేజ
శాశ తోల్లాస శ ◆ ర్వాణీశ శంకర
రజత గిరినివాస ◆ పరిణుత చరిత
లంగ దుత్తుంగ సా ◆ రంగ సంహరణ శు
భాంగ బ్రహ్మార్చిత ◆ సంగ రహిత
మంగళ దాయక ◆ గంగా మనోహర
గాంగేయ గిరిచాప ◆ కామభంగ
ముని జనోత్కృష్ట మానస ◆ వసతి చంద్ర
లలిత కాత్యాయనీ చిత్త ◆ నలిన హేళి ॥౮౬॥ 86

సీ॥ మెప్పించి శివముని ◆ మేఘు నాకర్షించి
పుడిసెడు జలమిడ ◆ నడిగి నట్లు
కష్టించి నిర్జర ◆ గవిం జేరి గుమ్మెడు
క్షీర మిమ్మని వేడ్కం ◆ గోరినట్లు
ఘనత రుక్మాచలా ◆ గ్రముం జేరి బంగార
మును నొక్క చిన్నమి ◆ మ్మనన యట్లు
వర ఫాలిమను గల్ప ◆ తరు శాఖలనుం జేరి
వెనం గసుంగాయకై ◆ వెదకి నట్లు
నిన్నుం దుచ్ఛంపు సుఖముల ◆ నేను గోర
నీదు సన్నిధి నాకిమ్ము ◆ నీలకంఠ ॥౮౭॥ 87

# శ్రీ సకలేశ్వర శతకము.

సీ॥ వని కాళహస్తిలోఁ • జన్మ మెత్తినఁ దొలి
జన్మ పాపంబులు • నమసి పోవు
శ్రీశైల మను మహా • క్షేత్రంబు దర్శింప
నత్యంత జన్మ రా • హిత్య మొదవు
నమరు సద్భక్తితో • నరుణాచలంబనఁ
దలఁచిన మోక్షంబు • గలుగు చుండు
నల వారణాసిలో • నంతరించిన నీదు
సాన్నిధ్య మబ్బు ని • స్సంశయముగ
వీని నెఱింగిన వాఁడే పో • విబుధ వరుఁడు
నిన్నెఱింగిన వాఁడె పో • నీతి ధరుఁడు ॥గిరి॥ 97

సీ॥ తొలి జన్మమున నీదు • లలిత సద్భక్తి యొ
కించు కేనియును బ్రా • ప్తించు వాఁడు
పుడమి నిర్జనుఁ డౌచుఁ • దొడర జన్మించి జ్ఞా
నైశ్వర్య సమితినే • నవనిఁ జెలఁగి
సర్వ లక్షణ సత్య • శాంతి చిత్తంబున
నొప్పి సమరు చెంత • నొనరఁ జేరి
వాని దాదయు చేత • వగ్గిల్లి తుదకు నీ
సాయుజ్య మందు ని • స్సంశయముగ
నట్టి నీభక్తిఁ గల్గిన • యట్టి వారి
గాక బ్రాహ్మణులని వేఱ • కలరె ధరణి ॥గిరి॥ 98

సీ॥ ఉదయంబునను స్నాన • మొనరించి నిర్మల
స్థలమందు కడు సుఖా • సక్తి నుండి
నిశ్చలుండై శివ • నేత్రము ల్మోడించి
శూన్య మనము లోక్క • చోటనిల్పి
యమల చిత్కళ పూర్ణ • మగు నీదు రూపంబు
హృదయాంతరంబునం • బదిల పఱచి
పరమ సద్గురు కృపా • బలముచే బ్రణవంబు
జపియించుచును వీత • సంగుఁడగుచు
పూర్వ భవ సంచితాదులఁ • బోనడంచి
నిన్ను దర్శించు వాఁడె పో • నిర్మలుండు ॥గిరి॥ 96

సీ॥ నినుఁ గొల్చి కాదె రా • వణుఁడు శ్రీ రాము చే
తను గూలి సాయుజ్య • ము గడించె
నినుఁ బ్రతిష్ఠింపరే • యిన కులుండా రావ
ణునిఁ జంపినట్టి హ • త్య నుద్యజించె
నినుఁ బూజసల్పరే • హనుమంతుఁడా రామ
చంద్రుని భక్తుఁడై • జగతిఁ దనరె
నిను సేవఁ జేసి ప • వనుఁడు పూతాత్ముఁడై
హనుమంతుఁ గాంచి పా • వనతఁ బొందె
నన్ని విధములఁ గాంచిన • నిన్నుఁ బూజ
సేయువారికి మోక్షంబు • చేయవయ్య ॥గిరి॥ 97

# శ్రీ వకలేశ్వర శతకము.

సీ॥ భావనా పాంచిత • భక్తి గుణోన్ముక్త
మగు నీ సత్స్మర • ణాంబకముల
కాము పురబునం • గలుగు లోభాది నీ
చపు శత్రువుల నెల్ల • నరగఁ గూల్చి
ప్రణవ మంగళ వాద్య • పటలి నాలించుచు
శాంతాది సకల భూ • షణుఁడు నగుచు
హర్ష సామ్రాజ్య సిం • హాసనాంచితుఁడునై
లలిత సాయుజ్యంపు • లక్ష్మిఁ గూడి
పరఁగి బ్రహ్మాదు లెల్లగు • బ్రస్తుతింప
పరమసౌఖ్యంబుఁ గాంచు నీ • భక్తవరుఁడు ॥గిరి॥ 98

సీ॥ దక్షక న్యోద్వాహ • దీక్ష నీవుండిన
నాఁడు కీర్షకఁమను • మాడ లేదె
నీ జటాస్థలి గాన • నేరక మిథ్య వ
ల్కంగ శాపంబుని • య్యంగి లేదె
చెలఁగి మార్కండేయుఁ • జిర జీవిఁ జేసిన
నాఁడు వ్రాఁతను మాపి • నావు గాదె
శ్రీ శంకరుండవై • చెలఁగి వాదంబున
మించి యోటమిని బొం • దించ లేదె
ఇట్లు నన్నిష్టను మిగుల వం • చించి నట్టి
నీవు నావ్రాఁత మాపి స • న్నోవ లేవ ॥గిరి॥ 99

సీ॥ తనరు శ్రీ తుంగభ • ద్రాతీర మందున్న
నందూరు గ్రామ మం • దుండు వాఁడ
కౌశిక గోత్ర సం • కలితుండ భక్తి గో
పిఁదు వంశంబున • న్వెల యువాఁడ
చెలఁగు శ్రీ నందూరి • శివ రామయకు సుంద
రాంబ కుద్భవ మంది • నట్టి వాఁడ
ఘనుఁడు సుబ్బారాయు • కవిత మే నల్లుండ
లక్ష్మీ నృసింహాఖ్య • లక్ష్మి తుండ
నీకు శతక మాల్య శత పత్రి • మిచ్చి నాఁడ
తప్పు లున్నను మన్నించు • దయను జూడు ॥గిరి॥ 100

సీ॥ మంగళం బగుచు మా • మహిళా మనోహరి
సంగ జానకి జయ • మంగళంబు
సంగ విధ్వంసన వి • శారదోజ్జ్వలునకు
మానిత కీర్తికి • మంగళంబు
గంగాంగనాంగ • శృంగార మాళికి
సంగీత హితునకు • మంగళంబు
ప్రమథ గణానేక • పరివేష్టితునకును
గాంగేయ ధన్వికి • మంగళంబు
పాడి నకలేశ నీకు ని • వాళి గాఁగ
నీ శతక రాజ మంకితంఁ • జే నొనర్తు ॥గిరి॥ 101

